ఊరుకోలేక పోయాడు మునసబు. తనూ నిలబడ్డాడు: "ఏమాటండి శాస్త్రిగారూ సన్యసించేస్తున్నారా?... కాశీకి ప్రయాణం కట్టేరా?... యేమిటీ ఈ హడావుడంతా?!?"

"మనవూరుమీద కోపం వొచ్చిందేమో!" అని గొణుగుతున్నాడు కరణం, తన ప్రశ్నని మళ్ళీ మళ్ళీ చూపులతో నే పృచ్ఛిస్తూ—

శాస్త్రి రెండడుగులు వేశాడు. వీరపరెడ్డికూడా లేచి అయ్యవార్లంగారితో అన్నాడు: శాస్త్రి తరఫున: "తంటసాలన్నీ వొదిలించుకుంటున్నాడు లెండి"—

పేరుపేరునా సెలవుతీసుకుని శాస్త్రి వెళ్ళిపోయిన దిక్కు చూస్తూ అయ్యవార్లంగారు మిగిలిన వారితో అన్నారు:

"నా అనేవారెవరూ లేరు... యెవరికోసమనో సుఖం అనేది లేకుండా ఈమనిషి నాలుగు చేతులా ఆర్జించాడు... సుఖపడేయోగ్యతుండొద్దూ?"

ఈ ఉదయం, ఇదే అయ్యవార్లంగారు ఇదే చావడిదగ్గిర నలుగురితోటే అంటున్నారు: "అవు అవసరం వేరే వుంది—అని ఆ మనిషి అన్నప్పుడే నాకు అనుమానం వేసింది. తన చితి తనే పేర్చుకుంటున్నాడేమిరా అని!"

ఇటు ప్రథిలవారి కొంపల్లో గుండెలు పగల కొట్టుకుంటూ యేడుస్తున్న వితంతువు, శాస్త్రి కంటె రెండు మూడేళ్లు చిన్నదీ అయిన ఈ నారమ్మ ఎవరు?

అతనికి తోబుట్టువా? వంటలక్కా? కాదు... కాదు...

అతని సన్యాసి సంసారానికి లోగడ అప్రయత్నంగా దొరికిన ఒక ఆడ దిక్కు!

రెండేళ్ళక్రితందాకా ఈమెని ఆవూరివారెరగరు. ఎక్కడినుంచో ఆకాశంమీదనుంచపడ్డట్టు ఊడిపడి ఒక రోజు శాస్త్రి వాకిట్లో కూలబడింది. ఆనాటినుంచీ ఆ యింటికి ఆమె ఒక కావలి కుక్క అయి కూర్చుంది.

బంధుత్వం విషయం శాస్త్రిని ఎవరూ అడగలేదు. అడగలేరు, అడగరు. సంభాషణ పెంచే మనిషిని చూస్తే అతను తప్పించుకుని వెళ్లిపోయేవాడు. రకరకాల ప్రస్తావనలమీదట నారమ్మే ఆ విషయం చెప్పకు పేరి ఇలాంటి పొరుగుల ఆడవాళ్ళ ఊహ్య.

శాస్త్రికి ఈ నారమ్మ అనే నారపు బంధువు మినహా ఇంకెవరూ లేరా?

"ఆయన కెవరూ లేర్నాయనా ... అన్నిదిక్కులా పోయి గొల్లుమంటున్న నన్ను చేరదీశాడు. ఈ దిక్కు కూడా నాకు లేకుండా చేశాడు దేవుడు. ఒక్కమాటేనా చెప్పకుండా వచ్చిపోయాడు మా చినబాబు..."

* * *

రెండు నెలల్క్రితమే శాస్త్రిలో ఒక విపరీతమైన మార్పు కనిపెట్టింది నారమ్మ. మనిషి కొంచెం నీరసపడిపోతున్నట్లు కనిపించసాగేడు. అంతే కాదు— పూర్వం యెప్పుడూ కనిపించని విసుగూ చిరాకూ అతనిలో ముఖ్యంగా కనిపించసాగేయి.

అప్పట్లో నే అనుకుంటాను. శాస్త్రి ఏదో వూరు వెళ్ళి సాయంత్రానికే తిరిగిరాక మూడు నాలుగు రోజులకు వచ్చాడు. మనిషి ఎందుచేతనో డీలాపడి పోయాడు. ఒక రోజున అకస్మాత్తుగా రైతు పోలయ్య మీద మండిపడ్డాడు. తర్వాత తన దురుసుతనానికి తనే చాలా బాధపడ్డాడని నారమ్మ అంటుంది.

అప్పటినుంచే కాబోలు ఎప్పుడూ లేని చదువులు ప్రారంభించాడు రాత్రిళ్లు. గంటల తరబడి కళ్లు చిల్లులు చేసుకుంటూ లాంతరుదగ్గిర కూర్చునేవాడు. ఏవేవో వ్రాసుకునేవాడు.

నెలరోజుల క్రితం మళ్ళీ ఊరెళ్ళి నాలుగు రోజులలో తిరిగి వచ్చాడు. ఈసారి మనిషి రవంత స్థిమితపడ్డాడు. కాని అలవాటులేని రాత్రిళ్ల చదువులు మరీ యెక్కువయ్యాయి.

అటువంటి సమయాలలో-వసారాలో నేల మీద చెంగుపరుచుకొని పడుకుని వున్న నారమ్మ తనన్ను ఉసూరుమనేది. నాలుగైదు సార్లు నోరు కూడా చేసుకుంది.

"ఒళ్లు పాడుజేసుకుంటూ యెందుకు బాబూ ఈ తాపత్రయం?" అని.

అతను వినిపించుకునేవాడు కాదు.

ఇదంతా ఏవిధంగా యెవరికి దఖలు పరచాలి ఇతని ఆస్తిపాస్తులన్నీ ఎంతకాలం కోర్టు లిటిగేషన్లలో వుండాలి? అది తెమిలేలోగా తనకొచ్చు ఎంతవరకూ అరిగిపోవాలి?

ఎందుకు వచ్చిందిరా ఈ దిక్కుమాలిన పంచాయితీ అని కరణంతోబాటు బోర్డు అధ్యక్షుడు వారప రెడ్డి కూడా బాధపడుతున్నాడు.

"ఏదో నూటికి కోటికి మన హయాంలో ఇలాంటివి జరక్కపోతే యెలాగయ్యా" అంటాడు మునసబు. అతనిదంతా పిడివాదం. ఇటువంటి సంఘటనల వలన గాని ఊరి పేరు పేపర్లో పడదు.

శాస్త్రికి ఆ వూళ్ళో విరోధులుండడానికి వీలు లేదు. ఎవరేనా చిల్లర మల్లర అడిగిందే తడవుగా ఇచ్చి వేసేవాడు. అతని దగ్గరికి, వ్యాపారానికయ్యేది డబ్బు సర్దుబాటుకయ్యేది, రాజమండ్రీనుంచి ఇద్దరు ముగ్గురు వర్తకులు వచ్చిపోయేవారు. వాళ్లు మంచి పరపతి ఉన్నవారే. ఎంత పిసినిగొట్టు మనిషని శాస్త్రి పేరు పొందినా, అతని పిసినారితనంవల్లా - పట్టుదల వలన బాధపడి ఇబ్బందులు పడిన వారు గాని, అతని పట్టుదల వలన కష్టాలపాలయినవారు గాని, ఆ గ్రామంలో లేరు. ఆ చుట్టుపట్లా లేరు. ఎవరేనా దూరంగా వున్నారేమో యెవరూ యెరుగరు.

పట్టుదలా పిసినిగొట్టుతనం అతను సేద్యంలో చూపించేవాడు ముఖ్యంగా. తను రెక్కలు విరుచుకుని పని చేసేవాడు. ఎదుటివాడిచేత చేయించేవాడు. చెట్టుని వున్న ఒక్క కాయా ఎవరినీ ముట్టుకోనిచ్చే వాడు కాదు.

గ్రామానికి సంబంధించిన వ్యవహారాలలో మాత్రం మొదటినుంచీ అతనిది ఒకటే పద్ధతి. పది మందీ కలిసి చేసిన నిర్ణయాన్ని తానూ ఒప్పుకునే వాడు; కక్షలలో మాత్రం కలుగజేసుకునేవాడు కాదు.

సుమారు పుష్కరం క్రితం శాస్త్రి తల్లిదండ్రులు ఎక్కడనుంచో ఈ వూరు తరలివచ్చారు. దరిమిలాని ఒకటి రెండు సంవత్సరాలకే శాస్త్రి దిగి వ్యవసాయం ప్రారంభించాడు. రెండెకరాల మాగాణి పొలంతో. అతని తండ్రి యెప్పుడూ వీధి వాకిలి చూడనే లేదు. ఆయన చివరి జీవితం అంతా ఒకే మంచంమీద గడచిపోయింది. శాస్త్రి తల్లిని మాత్రం అవూరివారు తరచు చూస్తానే ఉండేవారు—గోదావరికీ ఇంటికీ మధ్యని-నీళ్ళ కడవతో. ఒక పండు ముత్తైదువ ఒక పార్వతీదేవి వలె- మెల్లగా అడుగులలో అడుగులు వేసుకుంటూ వెళ్లేది!

అతను వచ్చిన మరి రెండు సంవత్సరాలలోపునే తల్లిదండ్రులిద్దరికీ ఒకే మాసంలో అతను దహనం చేశాడు. యథావిధిగా కర్మ జరిపించాడు. అదివరకు తలమీద వుండే క్రాపింగు తల్లి చనిపోయినప్పుడే మాయమయి మరి రాలేదు. అతని వేషం కూడా ఆనాటినుంచే మారిపోయింది. ఒక కుంకుపంచ, బనీను-కుంకుమ వస్త్రాలలోకి.

ఒక విరాగివలె కనపడేవాడు. కాని, అతి పొదుపరి. నిత్య సంధ్యావందనాదికాలతో కర్మిష్ఠి అనే పేరు సంపాదించాడు. నారమ్మకు పూర్వం స్వయంపాకం మీదనే బ్రతికేవాడు.

మంచిబలిష్ఠుడూ, ఆజానుబాహుడూ అయిన అతనికి గ్రామం వయస్సు నిర్ణయించలేకపోయింది. నారమ్మ అంచనా ప్రకారం యేభయి దగ్గర. కాని అతని శిరం పది సంవత్సరాలు తక్కువే చెపుతుంది. అతనికంటే చిన్నదే అయిన నారమ్మ షష్టిపూర్తి అయిన జీవిలాగ కనపడుతుంది.

తెల్లవారకట్ల ఏనాలుగింటికో లేచిన శాస్త్రి పొలంలో కాయకష్టం చేసుకుంటూ, అపరాహ్ణం తిరిగివచ్చి ఏక భోజనం చేసుకుని, ఆతర్వాత ఎన్నడూ విశ్రాంతిని ఎరుగక, రాత్రి ఏ పదింటికో పడక చేరేవాడు.

ఒక విధంగా ఎన్నడూ నీతి నియమం తప్పని ఈ మనిషి, పదిమందికీ ఒక ప్రశ్నగానే, అర్థంకాని సమస్యగానే చనిపోయాడు. తన స్వంత దహన సంస్కారాలకు ఏమి యేర్పాటులు చేసుకున్నాడో గోచరం కావటంలేదు పెద్దలకు.

"ఆయనకి నేనూ నాకు ఆయనా మిగపోయిస్తే చేయనిక్కా లేదండి. యావత్తు కర్మ యథావిధిగా ముందు జరిపించండి స్వామీ—" అని కళ్ళనీళ్లు తుడుచుకుని అన్నది నారమ్మ.

గతించినదానికి విచారించీ తల మొత్తుకునీ లాభంలేదని ఆమె గ్రహించేసరికి ఉదయం పదిగంటలు దాటింది.

# ఎదురువచ్చిన మృత్యువు

ఆ వీధి స్త్రీలంతా పొయ్యిలలో నిప్పువెయ్యక శవం ఎప్పుడు కదులుతుందా, ఎప్పుడు రెండు మెతుకులు ఉడకవేసి పిల్లలకి పెట్టుకోవటా అని ఎదురుచూస్తున్నారు.

ఏది ఏమయినా అది తప్పదు కదా!

"ఆ మహానుభావుడి ధర్మమా అంటూ ఇంటో ఊరంతటికీ సరిపడే సరుకుంది. ఏదో రొక్కం నిలవ వుంటుంది...కానియ్యండి బాబూ..."

అని జవాను మరొక్కసారి ధైర్యం చెప్పిన తర్వాత కరణంగారి కాలు కదిలింది. రెండు మూడువందల లోగిళ్ల బ్రాహ్మణ్యంగల అగ్రహారం, విశ్వనాథశాస్త్రి భౌతిక దేహం దహనసంస్కారానికి గోదావరిఒడ్డుకు ప్రయాణం చేసింది.

ఇరుగు పొరుగుల స్త్రీలంతా ప్రక్కల వారింటికి మిగిలివున్న ఒకళ్లే నూరమ్మని మరీమరీ పరామర్శించి వెళ్ళిపోతున్నారు. ఏదో అన్నీ తనకు తెలుసునని చెపుతోందేగాని, నిజానికి విశ్వనాథశాస్త్రి హృదయంలో గుప్తంగా నిలచిపోయి దహనమైపోయిన సంగతులు ఆమెకేమి తెలుసు?

అతని భార్యాబిడ్డలు అసలుండేవారా? అతని అత్తవారెవరు? ఎక్కడ? అతని పూర్వచరిత్ర యేమిటి?

ఈ మనిషి ఎక్కడెక్కడికో తిరుగుతూ రకరకాలుగా పడిన తాపత్రయం ఏమిటి? ఎందుకు పడ్డాడుట?

ఈ ప్రశ్నలకి ఆమె ఏమి సమాధానాలు చెప్పగలదు—?

ఒక్క నమస్కారం తప్ప!

* * *

దహన సంస్కారం పూర్తయిన మరుక్షణంలో, ముందుముందు ఎందుకైనా మంచిదనే వుద్దేశ్యంతో, దినపత్రికలకు కరణంగారి సంతకంతో ఒక ప్రకటన పంపబడింది.

మృతి వివరాలు ఇస్తూ - ఎవరైనా అతి సన్నిహితులు గాని ఆత్మీయులు గాని శాస్త్రిగారి ఆస్తి పాస్తులకి వారసులు కాతగ్గవారుంటే పూర్తి వివరాలతో వెంటనే తెలియచేస్తూ (యథావిధిగా కర్మ చేయడానికి) బయలుదేరి రావలసింది - అని ఆ ప్రకటన.

అనవసరమైన లిటిగేషను ముందుగానే పెరగకుండా వుంచడానికిగాను ఇందులో ఆస్తి వివరాలు మాత్రం ఇవ్వబడలేదు. ఇది పంచాయితీ పెద్దలంతా ఏకగ్రీవంగా ఆమోదించి చేసిన పని.

"ఒక్కసారి మాటవరసకు కూడా చెప్పలేదు ఎక్కడి వాళ్లెవరున్నారో యేమిటో...ఇక్కడ తలదాచుకున్నందుకు మోయలేని బరువులన్నీ నా నెత్తినే వొదిలివెళ్లేడు కదా...అహోరాత్రులు కష్టించి సంపాదించిన ఆస్తికాస్తా ముక్కలైపోతూంటే చూడవలసిన కర్మకూడా నాకు రాసివుంది కాబోలు..."

అని నూరమ్మ మనిషి మనిషిదగ్గరా వాపోవసాగింది.

నిజమే మరి. దిక్కులేని ఆవిడ. అంతా పరాయి వాళ్లు. తానూ పరాయిదే. ఏమిచేస్తే ఏమంటారో ముందు ముందు.

ఆమెని హఠాత్తుగా నిండు సముద్రంలో నే ముంచి పారవేశాడు—అదికూడా వాస్తవమే!

వ్యవహారం వ్యవహారమే మరి. పద్ధతి ప్రకారం నడవుకోవలసిందే - ఎవరైనా. ఆ యింటగల సరుకుల జాబితా, కంటికి కనపడే ఆస్తివివరం పంచాయితీ పెద్దలు తయారుచేశారు. ఇంట్లో కొంచెం తక్కువగా రెండువందల రూపాయల రొక్కం వుంది. బ్యాంకు పాసుబుక్కులు - చెక్కుబుక్కులు అన్నీ వున్నాయి. అతని పెట్టెలు అన్నీ తాత్కాలికంగా సీళ్లు వేశారు. ఇంటెడు సరుకులూ సామానుతో సహా నూరమ్మకు తాత్కాలికంగా వప్పగించారు...

ఆ రోజుకూడా తెల్లవారేసరికి శాస్త్రి గుణగణాలు అనోటాఅనోటా రకరకాలుగా ప్రతిధ్వనించసాగేయి. అతని మృత్యువు ఎంత వింతగా వుందో, ఆఖరివారపు అతని చరిత్రకంటే ఆఖరి రోజు అతని దినచర్య అందర్నీ విభ్రాంతుల్ని చేయసాగింది...

ఈ ఆఖరివారం యావత్తూ వ్యవహారాలన్నీ చక్కబెట్టుకోవడంలో అతను గడిపేడు. తను ఇవ్వవలసినవారందరికీ అణాపైసలతో లెక్కకట్టి ఇచ్చివేశాడు. తనకు రావలసిన బాకీలు చాలావరకూ రాబట్టుకున్నాడు. రానివాటికి రాలేనివాటికి విచిత్రంగా తెగతెంపులు చేసుకున్నాడు.

ఇద్దరు బాకీదార్లను తను ముక్కు పిండగం చేయర గని ఇద్దరు రాజమండ్రీలోని సామాన్య గృహస్థులకు అవార్తీ వేశాడు. మిగిలిపోయిన నోట్లమీద ఈవిధంగా చెల్లు వ్రాసియిచ్చాడు :

“ కారణాంతరాలవలన ఈనాడు నా పరిస్థితులు బాగుగా లేకపోవడం వలన, ఈనోటు బాపతు అసలు ఫాయిదాలు యావత్తూ నాకు ముట్టినట్లే భావించుకుని చెల్లు వ్రాస్తున్నాను. ఈ నోటుమీద ఇక నాకుగాని, నా అనంతరం నా వారసులకు గాని యెటువంటి బాధ్యతా యేవిధమైన హక్కూ లేదు.”

ఒక్క కొవ్వూరులోని రంగయ్య శ్రేష్ఠిమాత్రం ఈ విధంగా చెల్లు వ్రాయించుకోడానికి వప్పుకో లేదుట. ఒక్క వారం రోజులలో సొమ్ము సర్దుబాటు చేస్తానని బతిమాలుకున్నాడు. శాస్త్రి భిక్షుకికి అన్నగారు. ఒప్పలేదు చెల్లువ్రాసి : “నిజంగా సర్దుబాటు చెయ్యాలని నీకుంటే — నీ యిష్టం వొచ్చినప్పుడు, నే వున్నా లేకపోయినా, ఏ పరిస్థితిలో వున్నా — సొమ్ము యావత్తూ కరణంగారి చేతికియ్యి. దాన్ని ఏ విధంగా వినియోగించాలో వారికి తెలుస్తుంది —” అని అంటూ రెండోమాట వినిపించుకోకుండా వెళ్ళిపోయాడుట.

ఆ రంగయ్య వెయ్యిరూపాయల చిల్లరా పుచ్చుకుని ఇప్పుడు కరణంగారి యెదుట నిలుచున్నాడు :

“ఇంకో సమయంలో అయితే యిది కాజేసే వాడినే - నేపెద్ద నీతిమంతుణ్నని కాదు...కాని, ఇందులో ఒక్క పైసా కక్కుర్తిపడితే చాలు దుంప నాశనమై పోతానేమోనని భయం వేసింది” అని అతను నిజం వొప్పుకున్నాడు.

నలుగురి సలహామీద అన్నిటితోటే యుక్తి తేలుతుందనే ధీమాతో కరణం ఆ పెట్టెంగుకున్నారు - భగవంతుడిమీద భారం వేస్తూ.

మిగిలిన చెల్లుబడి వ్రాయబడిన నోట్లబాపతు మనుష్యులూ వారి కుటుంబాల సహితంగా గొల్లు మన్నారు శాస్త్రికోసం. అతని చరిత్రకు శిఖరంగా మిగిలివున్న సీతమ్మ పాదాలు తడిపేరు కన్నీళ్ళతో!

ఇంతే కాదు —

ఇటు రాజమండ్రీలోనూ అటు కొవ్వూరులోనూ — అతనికి స్నేహితులూ ముఖపరిచయులూ చాలామంది వున్నారుట. ఇంటింటికీ వెళ్ళి వారిని పలకరించి, వారివారి పిల్లలచేతుల్లో పాతికా పరకా పెట్టి వెళ్ళిపోయాడుట - ఈమధ్య.

నూరమ్మలూ పేరమ్మలూ విస్తుపోవడంలో ఆశ్చర్యం లేదు. ఇప్పుడు విస్తుపోతున్నది కరణంగారూ — ఆయన పరివారమూను.

శాస్త్రి నిజంగానే మహానుభావుడయి వుండాలి — సమీపిస్తున్న మృత్యువు సంగతి యెరిగినవాడయితే.. లేదా, ఏనాడో అతని భవిష్యత్తు చెప్పిన ఏ జ్యోతిష్కుడి లెక్క ప్రకారమో మృత్యువు వేంచేసి వుండాలి.

అయినా — ఆధారం?

దిగులు తీరిగి పదిమంది స్నేహితులనూ చూసి రావచ్చును...ఏకొ విధాన అయినా పయినా లేని వ్యక్తి పోరాలన్నీ ఇల్లలికి ముగ్గుపెట్టినట్లు చక్క పెట్టుకోవచ్చును...తనకు పిల్లా పీచూ లేరు కాబట్టి రావలసిన బాకీలు వచ్చినట్లే భావించుకుని వుండవచ్చును —

అతనికి నిజంగానే దక్షిణామ్నాయంనుంచి ఆహ్వానం ఒక నెలరోజుల ముందు రాకపోయినా వారంరోజులు ముందుగానే వచ్చివుండవచ్చును...యెదురు వచ్చిన మృత్యువు మరి పదిగంటలు టైమిచ్చివుండవచ్చును...

“తను చస్తానని యెరిగిన మనిషి చెయ్యవలసిన పనులన్నీ పూర్తిచెయ్యలేక ఈమనిషి?” అని కరణం తనమీదనే నొచ్చుకుంటున్నాడూ అంటే కారణం లేకపోలేదు —

గ్రామ శ్రీమూర్తుల మెడకు చుట్టుకున్న ఉరి త్రాడే అది !

రెండోనాడు తెల్లవారేసరికి గ్రామచావడి దగ్గిర నలభైరెండో సంవత్సరపు ఆగష్టు ఉద్యమాన్ని గురించి చర్చించేవారికి జనం సమకూడివున్నారు. అందరినోటా శాస్త్రి పేరే. పరిశీలించి చూస్తే ఈ జన సమూహంలో పరాయి గ్రామస్థులు కూడా చాలా మంది కనపడతారు తాత్కాలికంగా అంతా కులమత కక్షలు విడిచిపెట్టున్నారు.

ఏమంటే అందులో దావీదు అనే క్రైస్తవ ఉపాధ్యాయుడు ఇద్దరు ముగ్గురు హరిజన శిష్యులతో ఒక సర్వేరాతిమీద చతికిలపడి వున్నాడు. అతని

ఆ తర్వాత శాస్త్రి గారి విగ్రహం ఊరికి దూరంగా కొత్తగా వున్న మాదిగ గూడెం వేపు నడిచివెళ్ళినట్లు స్థానిక పత్రికొకటుల వాక్యం.

తాటి తోపులోంచి నడుస్తున్న ఈ పిలకశాస్త్రి గారిని దారిలివీధిలో చాలామంది పరకాయించి చూశారు. ఇరుకు గుడిసెలనీ కుళ్ళు కాలవలనీ తప్పించుకుంటూ ఏదో నిద్రమత్తులో వున్నట్లున్న అతన్ని చూసి అంతా ఆశ్చర్యపోయారు. అతను వాళ్ళని గమనించినట్లే లేదు.

అటు ప్రభుత్వంవారినీ ఇటు మిషనరీవారినీ అండగా చూసుకుని ఒక పాక వేసుకుని అందులో ఒక పాఠశాల నడుపుకుంటున్నాడు దావీదు. ఆదివారాలు ఆ పాఠశాలే ఒక చిన్న చర్చిగా మారుతుంది. దావీదు క్రైస్తవమతంమీద ఉపన్యసిస్తాడు. ఎవరేనా మతం పుచ్చుకుంటారేమో నని తాపత్రయపడతాడు. బాప్టిజం, ఒకటికి అయిదురూపాయలూ పెళ్ళి ఒకటికి అయిదురూపాయలూ—మిషనరీ వారిచ్చే పారితోషికం అతనికి. అతని సంపాదన కాస్తా సువార్త తిరుగుళ్ళకే ఖర్చయిపోతుంది.

పాక నెత్తిమీద ఒక పెద్ద కర్రసిలువ వుంది. చుట్టూవున్న ముళ్ళకంచెల ఆవరణకి ఒక విరిగిపడిపోయిన చిన్న వెదురుకర్రల గేటు—దాని నెత్తిమీద అక్షరాలు చెరిగిపోయిన పొడుగాటి బోర్డు.

శాస్త్రి పాక బయట నిలబడ్డాడు. లోపలగదిలో యుద్ధం జరుగుతోంది. శాస్త్రి పిలిచేడు. ఈ కంఠస్వరానికి లోపలియుద్ధం తాత్కాలికంగా నిలిచిపోయింది. మరి కాస్సేపటికి మసిబారిన లాంతరుతో రేగిపోయిన జుట్టుతో దావీదు ఎదురుగా ప్రత్యక్షమయ్యాడు— శాస్త్రిని చూసి ఎందుకో నివ్వెరపోయాడు.

అతని వెనకాలే వచ్చి నిలుచున్న సువార్త ముఖం రకరకాల చరిత్ర—ఆ చీకటిచాటునే చెపుతోంది. వయసులో దావీదుకంటే పెద్దది.

ఆ దంపతులిద్దరికీ బ్రాహ్మలూ, అందులో పిలక వున్న బ్రాహ్మలూ అంటే పరమ అసహ్యం—ద్వేషం...ఇతరకులాల వాళ్ళని ద్వేషిస్తే ఆ వూళ్ళో నిలవ నీడకూడా దొరకదని వారెరుగుదురు...

అర్థాంతరంగా వచ్చిన ఈ పిలకబ్రాహ్మడిని చూసి విస్తుపోయారు. వాళ్ళని పరామర్శిస్తూ కూర్చోడానికి శాస్త్రికి తీరుబడి లేదు—

శాస్త్రి మాట్లాడసాగేడు...

"ఏం దావీదూ! నీకు చివరకి ఎవరూ సహాయం చెయ్యలేదుట—ఆ మిషనరీవాళ్ళు కూడానా?"

కడుపులోంచి కోపంతో పొంగుతున్నా అణిచిపెట్టుకునే ప్రయత్నంతో దావీదు మూలిగేడు; సువార్త చిరచిరలాడుతూ రెండడుగులు ముందుకు వచ్చి దావీదు ప్రక్కనే నిలబడింది...అవసరం వస్తే ఆ ఎదుటి పిలకని చేత్తో లాగి పారెయ్యడానికి!

"సరే...దానికి మన మేంచేస్తాం...అయిందేదో అయిపోయింది. అనవసరంగా మతం చెడగొట్టుకున్నావు. అటూ యిటూ కూడా చెడిపోయావు...నీకు సహాయం కావాలి...డబ్బుంటే కాని నీకు పొట్టగడవదు. అది నాకు తెలిసింది."

దావీదు ఎందుచేతనో గాని "చిత్తమండి—" అన్నాడు. ఇంకోమాట అనడం అలవాటులేని నోరు వాడిది.

"ఈమధ్య నువ్వు పస్తులు పడుకుంటున్నావని కూడా తెలిసింది. నీకు కావలసిన సహాయం చేస్తా. ఈ స్థలం కొనుక్కోడానికీ, పడిపోయిన నీ పాక దృఢంగా కట్టుకోడానికీ...కొంత నీకు యిబ్బంది తీరే దానికీ కావలసింది అంతా చేస్తా—"

దావీదు ప్రపంచాన్ని మరచిపోతున్నాడు—ఎదురుగా నిలచివున్నది ఎవరో ఏమిటో కూడా అతనికి అవగాహం కావటం లేదు—

"నీ మొక్కలు సరిగ్గా పండితే ముందు సంవత్సరానికేనా నీకు గ్రాంటువస్తుంది...ఈలోగా కలో గంజో కాచుకుని బ్రతుకుతూవుండు..."

సువార్త క్రింది పెదవి రెండుఅంగుళాలు జారిపడిపోయింది. దావీదు రెండుచేతులూ కలిసి దణ్ణం పెడుతున్నాయి. ఎదురుగా శాస్త్రి స్వరూపంలో వాడికి ఏసుప్రభువు కనపడుతున్నాడు.

చదువుకున్నవాడివి...ఒక్క షరతు...దిక్కులేని పదిమందిపిల్లలకి చదువుచెప్పు...వాళ్ళందర్నీ నీ మతంలోకి ఎలాగేనా అయిదురూపాయల లాభం కోసం మార్చేయాలనే దుర్బుద్ధిమాత్రం పోగొట్టుకో.... ఎప్పటికేనా అది నీకు మంచిది....

శాస్త్రి వెళ్ళిపోతూ ఆగి సువార్తను చూస్తూ దావీదుతో అన్నాడు:

"ఇది యింకా వెనకటి పద్ధతిలోనే వున్నట్లు వింటున్నాను. భోగంది కూడా ఒక నీతికి కట్టుబడివుంటుంది. నీతో కలోగంజో తాగుతూ బతుకుతుందా... సరే...ఇష్టంలేదూ మెడపట్టుకుని గెంటెయ్యి... నీకు పెళ్ళాం లేకపోయినా వచ్చిన ఇబ్బందిలేదు. కూడూగుడ్డా వున్నవాడికి పెళ్ళాం. ఈ రోజుల్లోను నీకెందుకు? ఒక్కసారిగా ఎందరికి పెళ్ళాం అవుతుంది ఇది!...దీని వ్యవహారం ఈ తెల్లారిలోపునే తేల్చుకో—"

ఆమాటలు వింటూ, అతని చూపులు చూస్తూవున్న సువార్త పాతాళంలోకి దిగిపోతోంటే, డావీదు అన్నిటికీ చిత్తంకొడుతూ లెంపలు వేసుకుంటున్నాడు.

డావీదు దంపతులు ఆ రాత్రి ఏసుప్రభువుని మరచిపోయారు. అందుకు శిక్షగా తెల్లవారేసరికి వారికి వినబడింది—ఒక పిడుగులాగ—శాస్త్రి మరణ ఘోష.

"ఇంతకీ ఆ ప్రభువు కృప నాకులేదు. ఆ పంతుల్ని ఈరాత్రే తీసుకుపోవాలా?" అని తన అసమ్మతిని తన ప్రభువుకు యథేచ్ఛగా తెలియజేసుకున్నాడు డావీదు.

అంతేకాదు—పంతుల్ని ఎలాగయినాసరే తన పరలోక సామ్రాజ్యంలోకి తీసుకోవలసిందని డావీదు దంపతులు ప్రభువుకు ప్రార్థనలు కావించారు!

* * * *

శాస్త్రి చనిపోయి పదిరోజులయింది. గ్రామం అతన్ని మరచిపోతోంది. కాని—కరణం మునసబులకు మాత్రం మరవడానికి వీలు కుదరడంలేదు.

దినపత్రికలలోని ప్రకటనకు సమాధానంగా మూడు ఉత్తరాలు వచ్చేయి. ఉత్తరంకంటే పెద్దదైన టెలిగ్రాం ఒకటే వచ్చింది.

బంధువులు ముగ్గురూ ఎక్కడెక్కడో వుంటున్నారు. వారసులయ్యే ఆస్కారంమాత్రం తమకు కనపడడం లేదని విచారించారు. ఈ ప్రపంచంలో ఏదైనా జరగవచ్చు. అందుచేత వారివారి వివరాలు పూర్తిగా ఇచ్చుకున్నారు. నిలుచున్న పళంగా రావడానికి గవర్నమెంటు ఉద్యోగాలు—సెలవులు మంజూరు కావాలి. "ఇదేమాదిరి ఉత్తరాలు మూడు ఇంకా అనేకం వస్తాయికదా—బంధువర్గం పూర్తిలిస్టు మీ దగ్గరే ఈపాటికి తయారయి వుంటుంది. నాకు వారసున్నయ్యే యోగ్యత వుందని మీకు తెలిస్తే దయచేసి టెలిగ్రాం ఇప్పించండి...రెక్కలుకట్టుకుని కుటుంబంతో అక్కడ వాలగలను—"

అనే భరతవాక్యంతో మూడూ ఒకే ముసాయిదాకు తీసిన నకళ్ళలాగ ఉన్నాయి ఉత్తరాలు! ఒకదానికొకటి సంబంధంలేని మూడు ప్రాంతాలనుంచి వచ్చేయి.

ఇక నాలుగవది—అది టెలిగ్రాఫు ఉత్తరం. దాని తత్వమే వేరు...టూకీగా :

"నేను బంధువునే అయినా వారసుణ్ణికూడా అవగలిగే సౌభాగ్యత వుంటే—నాలాంటి వారసుల్ని విశ్వనాథశాస్త్రి గారికి ఒక వందమందేనా వుండాలి. ఇంతమందిమీ తగవులాడుకోవాలి. కోర్టులచుట్టూ తిరగాలి. కాబట్టి, ఆస్తిపాస్తుల వ్యవహారాలు నాకు సంబంధించినంతవరకూ అతి దూరంగా వుంచండి.

"ఎంతటి బలగం ఉన్నవాడికయినా సమయానికి ఒకరూ దగ్గరవుండక పోవచ్చును. ఆయనకి యథావిధి కర్మ చెయ్యడానికి ఆత్మీయులెవరూ లేకపోయిన పక్షంలో మీరు వెంటనే నాకు టెలిగ్రాం ఇవ్వండి. ఏవిధమయిన ఇతర మీమాంసలూ మీరు పెట్టుకోనవసరం లేదు...నే బయలుదేరి వస్తాను. నాకు సెలవు దొరకదూ, ఉద్యోగానికి రాజీనామా ఇస్తాను. యథావిధిగా కర్మచేస్తాను. తర్వాత మాసికాలూ అవీ ఇక్కడ పెట్టుకుంటాను. ఈవిధంగానైనా వారికి నా కృతజ్ఞత తెలియచేసుకుంటాను.

"అక్కడికి నేను తీరా వచ్చినతర్వాత ఆయన తాలూకువారు ఎవరేనా వస్తే, సరేసరి వారేచేస్తారు నేనేమీ అనుకోను.

"నాది ఒక్కటే షరతు. ఆస్తిపాస్తుల వ్యవహారం నాకనవసరం. ఒకవేళ నాకు ఏమైనా హక్కులుంటున్నట్లయితే వాటి నన్నిటినీ ఈ ఉత్తరం ద్వారా వదులుకుంటున్నాను. వెంటనే టెలిగ్రాం మాత్రం తప్పకుండా ఇవ్వండి..."

సమాధానానికి గాను కావలసినంత డబ్బు కూడా అక్కడే చెల్లించారు ఈ పెద్దమనిషి....ఇంత పురాణమూ చెప్పి తన బంధుత్వంమాత్రం ఏమిటో తెలియచేయనే లేదు!

"శాస్త్రికి దగ్గరవాళ్ళల్లాగే కనపడుతున్నారు ఈ నలుగురూ—" అన్నాడు నారపరెడ్డి. "ఒక్కడికీ ఆశలు లేవు—"

"లేకేం? ఆ ముగ్గురికీ వుంది. ఈ టెలిగ్రాం ఆయన ఎవడో పవ్వాసిస్తున్నాడు. పేరేమిటి?" అని మునసబు.

"ఆర్. పి. చంద్రం" అంటున్న కరణం కళ్లు వీధిలో నిలుచున్న ఆ వేపునుండి పరిశోత్రి ముఖాల మీద పడ్డాయి.

వీరంతా ఇప్పుడు స్టేషనులో దిగిన శాస్త్రి బంధువర్గంట—

ఈ వాళ్లుగోజాలనుంచీ రవంత జ్వరం తీస్తున్నట్లనిపించిన కరణానికీ టెలిగ్రాం చదువుతోంటేనే పూర్ణజ్వరం ముంచుకువచ్చింది. ఈ బంధువుల సైన్యాన్ని చూసేసరికి అతని కళ్ళకి మైకమూ శరీరానికి వణుకూ ప్రారంభమయి, ఆ జ్వరానికి ఒక 'మలేరియా' పరపతిని తీసుకువచ్చాయి

బంధువుల నందర్నీ తరలించుకొనిపోయి సూరమ్మకు అప్పగించాడు మునసబు. ఎంతో కృంగిపోయి వున్నా వారినందరినీ ఆమె గౌరవించింది, ఆదరించింది, భోజనాలకి యేర్పాట్లు చేయసాగింది. పాడుపడినట్లున్న ప్రభల వారింటికి ఇప్పుడు ఒక పెళ్ళికళ వచ్చింది...

కరణం తీరుబడిగా కూర్చుని ఆలోచించసాగేడు. నలుగురు పెద్దమనుష్యులలోనూ యెవరినీ పిలవనేమా—లేక అందర్నీ పిలవనేమా? మళ్ళీ మనకెందుకీ బాధ్యత—రేపు గవర్నమెంటు ప్లీడరే అన్నీ చూసుకుంటాడు... ఈ విధంగా పరిపరివిధాల పరుగులెడుతోంది అతని మనసు.

"మర్యాదకోసమేనా డబ్బుకట్టిన ఆ టెలిగ్రాం ఆయనకి ముందు ఏదో వో సమాధానం పంపించు" అన్నాడు రెడ్డి.

"అన్నీ అయోమయంగా ఉన్నాయి. మీకు ఇష్టమయితే రావచ్చు—" అని టెలిగ్రాం ఇవ్వబడింది.

ఆ మర్నాటికి ఒక పాతిక ఉత్తరాలు వచ్చాయి. అవన్నీ శాస్త్రిగారి పరిచయుల దగ్గర్నుంచీ స్నేహితుల దగ్గర్నుంచీ. శాస్త్రి మరణానికి తమ విచారాన్ని తెలుపుతూ అతని కుటుంబానికి (?) సానుభూతులు పంపుతున్నారు.

అందులో ఒకే ఒక ఉత్తరం కొన్ని పేజీలు వుంది. అది చదువుకోలేక పరాకు చిత్తగిస్తున్న కరణానికి నిలుచున్న పళంగా రావలసిందని సూరమ్మ దగ్గర్నుంచి కబురు—

ఇంటికివచ్చిన బంధువర్గం అంతా మెల్లమెల్లగా ఇల్లంతా అల్లుకు పోతున్నారుట. సూరమ్మ మనస్సు అందుకు మాత్రం ఒప్పడం లేదు.

"ఈ ఆస్తికి అధికారి యెవరో తేలేవరకూ అందరూ పరాయివాళ్ళే—నేనూ పరాయిదాన్నే! ఈ సరుకు నా చేతికి అప్పగించేరు కాబట్టి పూచీపడవలసిన బాధ్యత కూడా నాది. రేపు ఆ అధికారి యెవరో వొచ్చిం తర్వాత నేనూ నెత్తిమీద చెంగు వేసుకొని పోవలసిన దాన్నే కదా... ఈ పెద్దమనుషుల్ని కాస్త అదుపాజ్ఞలలో వుంచమనండి. నన్ను వీరెరుగరు—వీళ్ళని నే నెరుగను... లేదంటారూ—మీరే వో మనిషిని ఇక్కడ దూజమూనాలికి పెట్టండి—" అని నిక్కచ్చిగా అన్నది.

ఆమె మాట చెల్లక తప్పలేదు. మొహమాటాలు లేని మునసబు బంధువు లందరితోటే నిక్కచ్చిగా చెప్పేశాడు.

"పూచికత్తుల్లో పోయిందని అవిశ్వాసం చేసిందా అంటే మీ అందర్నీ తలార్ల చేతికిచ్చి కొత్వాలు తాలూకా ఆఫీసుకి తోలించేస్తాను—" అన్నాడు.

ఈ మాత్రం బాగా పనిచేసింది బంధువులకి.

* * * *

ఆ సాయంత్రం తీరుబడిగా కూర్చుని మిగిలిపోయిన పెద్ద ఉత్తరాన్ని చదువుతున్నాడు కరణం. రెడ్డీ మునసబూ వింటున్నారు—

అది ఎవరో ఒక స్త్రీ దగ్గర్నుంచి—

మంచి విద్యావతీ సంస్కారం గలదీ లాగ కనపడుతుంది... అందులో కొన్ని ముఖ్యమయిన భాగాలీ దిగువను ఇస్తున్నాను:

"ఈ వుత్తరం ఎవరికి వ్రాస్తున్నానో యెందుకు వ్రాస్తున్నానో తెలియడం లేదు. కుటుంబం లేని శాస్త్రిగారి కుటుంబానికా? లేక... నాకు నేనే వ్రాసుకుంటున్నానా?... లోనిబాధ—ఆ వేదన బయటికి కక్కక తప్పదు...

మునసబు వాళ్ళను లెక్క పెడుతున్నాడు. చూస్తూ వుండగానే ఎవరో దొరగారు కరణం ఇంటిముందు నిలబడ్డారు. ఆయన వెనక్కాలే నెత్తిమీద ట్రంకు పెట్టె హోల్డాలులతో కూలివాడు.

ఎవరు చెప్మా అనే లెక్కలోనే ఇంకా మునసబు చూస్తున్నాడు. దొరగారు మెట్లెక్కుతున్నారు. ఆయన బూట్ల చప్పుళ్లు కరణం గుండెలలో గుర్రాలను పరుగెత్తిస్తున్నాయి. అతనికి ఈ ప్రపంచం యావత్తు జనాభా మీదా విపరీతమైన కోపం ముంచుకు రాసాగింది. అంతేకాదు, తన సంసారం మీద వైరాగ్యం కూడా వచ్చేసింది—

ఎవరో ... ఏ పెద్దాఫీసరో ... యేమిటో— ముంచి పనుగానికే విరుచుకు వచ్చాడుగా కబోలు అని బెంబేలు పడ్డాడు. ఇవన్నీ పరీక్షలు...అగ్ని పరీక్షలు...వీటిని నిలద్రొక్కుకుంటే వైతరిణి దాటినట్లే. కాలవా ఒడ్డులకు విసిరేసి, కవచ ఖడ్గాలు పారవేసిన కౌరవుని ముఖం పెట్టి, కరణం గబగబా వసారాలోకి వినయాకారాలతో పరుగులు పెట్టేడు. అతని ఆకారంగూ పిలకా గోదావరీ స్నానం చేసినట్లున్నాయి. కుర్చీని అరుగు మీదికి లాగి చేతులు కట్టుకుని నిలబడ్డాడు మునసబు. ఒక లాంతరు స్తంభం వేషం వేశాడు వారపగెడ్డి.

కుర్చీలో కూర్చోకుండానే ఆ దొరగారు స్వచ్ఛమైన తెలుగులో అందుకున్నాడు.

"ఈ వూరి కరణం గారు—?"

"చిత్తం...ఏం సెలవో—"

"క్షమించాలి మీరే నన్ను," ఆయన దిక్కులు పరికించి సంగతి గ్రహించినట్లున్నాడు. "నే నిమ్మల్ని మింగడానికి వచ్చిన ఏ ఆఫీసర్నీ కాదు లెండి" అన్నాడు.

అర్థంకాని గ్రామ పెద్దలు ముగ్గురూ ముఖాలు చూసుకోసాగేరు.

"సరే.. మీకు కలకత్తానించి టెలిగ్రాం ఇచ్చిన పెద్దమనిషిని నేనే!" అన్నాడు.

ఆ మాటలు కరణం మెదడులోకి ప్రవేశించి, అతన్ని మూగ పిల్లి మంత్రాలను కొట్టించింది.

"మా టెలిగ్రాం సమాధానం చూసుకోకుండానే నే వచ్చేసినందుకూ, ఇటువంటి స్వాతంత్ర్యం తీసుకున్నందుకూ మీరంతా నన్ను క్షమించాలి—" అంటూ చంద్రం, కొద్దంటున్నా, అరుగు మీదనే చతికిల పడ్డాడు. "అసలు సంగతేమంటే—విశ్వనాథ శాస్త్రిగారికి నేనెంతో ఋణపడి వున్నాను. ఆయన వల్లనే చాలా సహాయం పొందాను. ఆ ఋణం తీర్చుకో దలచాను. కర్మ నా చేతులతోటే చెయ్యాలని బుద్ధి పుట్టింది. పత్రికా ప్రకటనా, నే మీకిచ్చిన టెలిగ్రాం కాపీ మా డైరెక్టరు ముందు పెట్టి-సెలవు ఇవ్వకపోతే రాజీనామా పెట్టేస్తాను-అన్నాను నవ్వుతూనే. ఆయన ఏమనుకున్నాడో — "ఆలస్యం దేనికి? వెంటనే వెళ్లు" అన్నాడు. బయలుదేరి వచ్చాను..."

ఇప్పటికి 'షాక్' నుంచి రవంత తెప్పరిల్లిన కరణం కాళ్లు ఇంకా వణుకుతూనే వున్నాయి.

"విమానం మీద విశాఖపట్టణం దాకా వచ్చి, అక్కణ్ణించి పాసెంజరులో వచ్చాను. కర్మ యెన్నో రోజుమంటీ చేస్తారో నాకు తెలియదు. ఆయన కర్మ చెయ్యడానికి నాకూ అధికారం వున్నా, అది యేటువంటిదో మీరడగవద్దు — నే చెప్పను..."

ఆజాను బాహుడూ, స్ఫురద్రూపీ, ముప్ఫై అయిదు సంవత్సరాల వయసులోనూ వున్న చంద్రాన్ని చూస్తూ చాలాసేపు కరణం ఏవేవో మంత్రాలు జపం చేసుకుంటూన్నట్లు కనపడ్డాడు. చివరికి ఒక నిర్ణయానికి వచ్చి:

"ఏది యేమైనా అన్నీ వివరాలూ మీకు చెప్పెయ్యడానికి తీర్మానించుకున్నాను. వినండి—" అంటూ చతికిల పడ్డాడు.

"క్షమించండి. ఆ వ్యవహారాలు నాకు వద్దు. మీరు చెప్పవద్దు. ఈ మాత్రానికి మీరూ నేనూ కట్టుబడి వుండటం చాలా మంచిది—ఉత్తరోత్తరా; ఎవరేనా కర్మ చేస్తున్నారా?"

"లే—దు"

"అయితే ఈ వేళనించి చెయ్యొచ్చునా? నా సామాను ఎక్కడ పెట్టుకోను...అక్కే—వెయింట్లో వొద్దు; ఏ కొంపపాకేనా చాలు—అక్కడి జనానికి నాకూ ఏవిధమైన ప్రమేయమూ వుండడానికి వీలు లేదు."

చంద్రం మాటలకు ఎదురు చెప్పగల స్తోమతు ఎవరికీ లేకపోయింది. శాస్త్రిగారి ఆఖరి పెరడులో వున్న

గోష్ఠిపాలలో చంద్రం మకాం పెట్టి జీవయాత్ర ప్రారంభించాడు.

* * *

విశ్వనాథశాస్త్రిని వైతరిణి దాటించాడు. కాని, అతని చితి మంట మాత్రం ఇంకా ఆవలిగట్టు కూడా చేరలేదు. శుద్ధ శ్రోత్రియుడి విధానంలో చంద్రం కర్మ చేశాడు. కూడా తెచ్చిన డబ్బు రెండు చేతులా ఖర్చు చేశాడు. గ్రామంలోగల చతుర్వర్ణాలవారికీ సమారాధనలు జరిపేడు. రెండుమూడు సార్లు ఆస్తిపాస్తుల వ్యవహారాలూ బంధువర్గపు గొడవలూ అతని దగ్గర మళ్లీ రెచ్చిపోయేసరికి, ఆ విషయాల పన్నిటినీ ఒక్క చిరునవ్వుతో త్రోసిరాజన్నాడు చంద్రం.

“మీకు ఏ ఆశా లేకపోయినా మీ అనుభవంతో మాకు కొంత సలహా యివ్వవచ్చును కదా—” అని కరణం బాధపడ్డాడు.

“అవసరం లేని వ్యవహారాలలో ఎంత మాత్రం కలగజేసుకోను అని ప్రతిజ్ఞ పట్టినవాడిని.” అంటూ చంద్రం లేచి వెళ్లిపోయాడు.

ఆ రోజు కరణంగారికి టపాలో కలెక్టరు ఆఫీసు నుంచి ఒక పెద్ద ఉత్తరం వచ్చింది. అందులో శాస్త్రిగారిని గురించిన ఒక మెమో కాగితం కూడా వుంది — లోగడ శాస్త్రి మరణాన్ని గురించి కరణం చేసిన మామూలు రిపోర్టుకు ఇది సమాధానం.

ఆ మెమో చదివిన కరణానికి ముందు కొంత ఉక్కిరి బిక్కిరి అయినా, తర్వాత కొంత శాంతి చేరింది.

ఇంక వారం రోజులకు తాను చనిపోతాననగా, శాస్త్రి ఏలూరు రిజిస్ట్రారు ఆఫీసులో ఒక విల్లు రిజిస్టరు చేసి, దాన్ని కలెక్టరుగారి చేతికి స్వయంగా అందించుకున్నాడుట. సర్కారువారి ప్లీడర్ల ద్వారా గాని తన గ్రామ పెద్దల ద్వారా గాని తన అనంతరం ఆ విల్లును అమలు జరిపించవలసినది గానూ, తన అనంతరం గాని విల్లును బహిరంగ పరచడానికి వీలు లేకుండా చేయవలసిందని కోరినాడుట. ఈ అమలు జరిపేటందుకయ్యే ఖర్చులు శాస్త్రి వారసులనుంచి ప్రభుత్వం రాబట్టుకో వచ్చును. కలెక్టరుగారు శాస్త్రిగారికి ముఖ్య స్నేహితులు కాబట్టి ఈ బాధ్యత లన్నిటికీ ఒప్పుకున్నారు.

గుట్టు బయటపడకుండా కరణం వెంటనే ఏలూరు వెళ్లి విల్లు నకలుతో ఆ రాత్రికి తిరిగి వచ్చేడు. గ్రామ పెద్దలు ముగ్గురూ విల్లులోని వివరాలు చదువుకున్నారు.

“నాకు ఇతర్రా బంధువులు గాని వారసులు గాని లేరు. నా ఆస్తిపాస్తులు షెడ్యూళ్లు, దాఖలాగా, రాజమండ్రీ ఆంధ్రబ్యాంకులో వున్న రొక్కం నిల్వతో కలిసి సుమారు అరవై తొమ్మిది వేల రూపాయలు...

“నేను చనిపోయే లోపున చెయ్యబోయే దానధర్మాలు ఇందులో ఉదాహరించడం లేదు. వాటికి సొమ్ము వేరే కేటాయించుకుని ఆట్టే పెట్టుకున్నాను. నేను ఎవరికీ యేవిధమైన బాకీలు లేను. నాకు ఎవరి నుండీ యే బాపతు సొమ్ములూ రావలసి లేవు.

“నా యావత్తు స్థిరచరాస్తులూ, షెడ్యూళ్లు దాఖలాగా, క్రింది మినహాయింపులు పోను, దాన విక్రయ సర్వాధికారాలతోనూ, ప్రస్తుతం రాజమండ్రీ పట్టణ—వీధి కాపురస్తురాలు, — గారి కుమార్తె అయిన చి॥ సౌ॥ సీతారావమ్మకు చెందవలెను. ఈమె ప్రస్తుతపు చిరునామా......ఈ ఒక్కతే నాకు చట్టరీత్యా వారసురాలై వున్నది. తన వారసత్వాన్ని ఋజువు చేసుకునే డాక్యుమెంట్లు ఆమె దగ్గర వున్నవి.

“మినహాయింపులు :— ఈ క్రింది దానధర్మాలు నా ఆస్తి నుండి చేయవలెను: ఇదే గ్రామంలో మాదిగ గూడెంలో నివసిస్తున్న క్రైస్తవ ఉపాధ్యాయునకు దావీదుకు రూ. 1500; మా పొలం ఈనాటివరకూ ము కు చేస్తున్న రైతు, పోలయ్యకు రూ. 500; ఎడ్ల జతలు కూడా ఇతనికే ఇచ్చివేయవలెను.”

ఆ తర్వాత సుమారు అయిదు వేల రూపాయలకు సరిపడే దానధర్మాల జాబితా ఇవ్వబడింది. ఇవి అనేక చిల్లరగల్లర సంస్థలకీ వ్యక్తులకీ చేయబడినవి. వ్యక్తులంతా ఆ వూరివారే. కాని, అందర్నీ ఆశ్చర్యంలో ముంచినవి రెండు విషయాలున్నాయి. సూరమ్మ పేరెక్కడా లేదు, ఆమెకు దమ్మిడీకూడా ఇవ్వబడలేదు. మరీ విచిత్రమయింది ఉపసంహార వాక్యం.

“నా అనంతరం నాకు జరపవలసిన కర్మకాండను గురించి యెవరూ విచారించవలసిన అక్కర్లా

ఇంకామె చెప్పలేక పోయింది.

—ఏమయితే నేమి. ఆ దిక్కుమాలిన వ్యక్తికి తన ఆస్తంతా ధారాదత్తం చేసేశాడు శాస్త్రి. ఎవరికేది ప్రాప్తమో ఈశ్వరుడికే తెలియును!

కరణం గారు మనసుండా బట్టలేక పోయారు. శాస్త్రిగారి ఆఖరి దాతృత్వాన్ని విపరీతంగా కాని యూనుకో —

"ఇంతికీ—ఆయన నిస్సహాయ స్థితిలో వుండి నప్పుడు మీరు చూపిన ఉదారానికి ప్రతి ఫలంగా దాన విక్రయాది సర్వాధికారాలతో తమ యావ దాస్తీ మీకు సమర్పించారు. దు దేలు డిచ్చినవి కుప్పె డటుకులే" అంటూ ఆమె చేతికి విల్లు కాగితాలు అందిస్తూ, "మీ రే సీతారామమ్మగారని బుజావు చేసుకుని, శాస్త్రిగారి విల్లు అమలు జరిపించడానికి మాకు తగిన సహాయం కల్పించండి—"

ఆమె కాగితాలు అందుకో నే లేదు. చాలా సేపు దిగాలు పడి అలాగ చూస్తూనే వుండిపోయింది. కొంత సేపటికి తెలివి తెచ్చుకుని లోపలికి వెళ్ళి, ఒక దస్తావేజు కాగితం తెచ్చి కరణాని కందించింది —

"అది - వారు మరణించే దానికి పదిహేను రోజులకు ముందు నన్ను వివాహం చేసుకున్న సంగతిని బుజావుచేసే దాఖ్యమెంటు—"

కరణం చెవులూ కళ్లూ పరిశెయ్యదం మాని వేశాయి అత్యిమాత్రం దకర కాలుగా ఘోష పెట్ట సాగింది. ఆయొయ్య ముసిలివాడా! 'ఆఖరి తరుణంలో దచ్చిపోతానని యెరిగివుండీ యెంత పని చేశావ్' అని వాపోతున్నాడు.

"నా దిక్కుమాలిన జీవితం అంతానిని....ఒక రోజాని 'నే చెప్పినట్టు చేస్తావా' అన్నారు. సరే అన్నాను....ఆ రోజొచ్చి తనని వివాహం చేసుకో మన్నారు—"

ఈ పెద్ద మనుష్యులలాగే ఆమె కూడా నిర్ఘాంత పోయి మాటలేక. నిలబడిపోయింది. శాస్త్రి ఒకేఒక్క మాటతో అజ్ఞాపించారు: "ఎవరూ చెప్పకు—నీ తర ఫునీ నా తరఫునీ అన్నీ ఆలోచించే ఈ పని చేస్తున్నాను...". ఆమె కేమ్ కాదు నలేదు. ఆ పాయంత్రమే బ్రహ్మనమాజ మందిరంలో ఇద్దరికీ వివాహం జరిగింది. ఆ మర్నాడు ఆమెను తీసుకుని వెళ్ళి సివిల్ లా ప్రకారం వివాహాన్ని రిజిస్ట్రారు వారివద్ద రిజిష్టరీ చేయించారు.

అసలు భర్త చనిపోయిన సీతారామమ్మ నానా అవస్థలూ పడుతూ జీవిస్తూవచ్చింది. ఒక్కొక్క గాలిపాటుకు ఒక్కొక్క వూరు వెళ్లింది. దరిమిలాని పుట్టిన పిల్లవానికి వంశగౌరవం ఇవ్వలేక, పతనమైన తన వ్యక్తిత్వాన్ని నిలుపుకోలేక, ఈ జీవితానికి అల వాటుపడి ఈ వీధిలోనే నిలతొక్కుకుని నివ సిస్తోంది ...ఈమెకి కులం గౌరవం స్థానం ఇవ్వడానికే ముఖ్యంగా వివాహం చేసుకున్నాడా శాస్త్రి అని పిస్తోంది—

పాపం...మంచి పుట్టుకగల మనిషిలాగే కనపడు తుంది ఆమె. రూపసి. కాని, ఆమె అందం మోడు బారిపోయినట్లు అనిపిస్తుంది.

"మొదట్లో - కేవలం ఆయన నాకు కులం గౌర వం ఇస్తున్నారను కున్నాను! ఏమైతే నేమి...ఆయన నాకు మాంగల్యం కట్టినవారు—నా భర్త!...కాని, ఆయన నాకు దక్క నే లేదు...."

"మేం పత్రికలో వేసిన ప్రకటన చూశారా?" కరణం బొంగురుపోయిన కంఠం ప్రశ్నించింది.

"చూశానండి..."

"ఈ విషయం మాకు తెలియజెయ్య లేదేమండి?"

"ఉదాత్త హృదయంతో ఆయన చేసిన పనిని నేను ఇంకో విధంగా ఎలా వుపయోగిస్తాను చెప్పండి. మీ వూరు వొచ్చి ఆయన ప్రతిష్ఠని కాస్తా గంగలో కలిపెయ్యనా? నానుంచి ఏ ప్రతిఫలం ఆశించ కుండా నే వివాహం చేసుకున్నారే నన్ను...ఆయనే లేనప్పుడు ఇతర విషయాలెందుకండి..."

"అర్థమయింది లెండి..." ఎంతో ఆవేదనతోనే అన్నాడు కరణం.

ఇంతలోకే ఒక ఆరేళ్ల కుర్రవాడొకడు పలక పుచ్చుకొని గొణుక్కుంటూ వచ్చాడు. వీరిని చూసి కిక్కురు మనకుండా తల్లి దగ్గరికి వెళ్లి నిలుచున్నాడు.

కరణం తటాలున లేస్తూ అన్నాడు: ఆ పిల్లవాడిని ఉన్నతిలోకి తీసుకురండి. యావదంతులు అదే పుణ్యక్షేత్రం అయిపోతుంది శాస్త్రిగారివి...మళ్లీ ఇంకో

సారి చేసో - గవర్నమెంటు తరఫున ఇంకెవరో మిమ్మల్ని కలుసుకుంటారు...సెలవు..." అంటూ వీధిలోకి దారి తీశాడు.

వారందరి వెనకనే ఆమె అరుగుమీదికి వచ్చింది:

"ముందు ఈ యిల్లు మార్పు చెయ్యండి. ఇంతకీ సూరమ్మగారిని ఏం చెయ్యదలుచుకుంటారు?"

"ఆ యింటినే కనిపెట్టుకుని వుండమనండి."

"ఆ వెయ్యి రూపాయలూ—"

"కర్మ చేసిన వారికివ్వండి."

"లాభం లేదు. ఆయన పుచ్చుకోడు..."

"అయితే ఆలోచించి చెపతా...అంత వరకూ మీదగ్గిరే వుంచండి."

* * *

తర్వాత రెండు రోజులు కరణం ఒక దీర్ఘ సమాధిలో గడిపి వేశాడు. శాస్త్రినీ శాస్త్రిగారి శవమునీ వైతరణి దాటించి వేసినా, శాస్త్రి మాత్రం కరణాన్ని వదిలి పెట్టేటట్టు లేదు. కళ్లు తెరిచినా మూసినా శాస్త్రి అతనికి కనపడతాడు. దీనికి తోడు కరణం శరీరం ఈ పదిహేను రోజుల్లోనూ పదిహేను సంవత్సరాల వార్ధక్యం సంపాదించింది.

కరణంగిరీలు వారసత్వపు హక్కులను ఏనాడో కోల్పోయాయి. అంటే రూల్ ప్రకారం కాక పోయినా, వాస్తవానికి జరుగుతున్న ఫలితాలు అలాగే వుంటున్నాయి. శరీరంలోని దుస్థితి అంతకంతకు ఎక్కువయిపోయి కరణాన్ని వీధి అరుగు మీదికైనా రానీయలేదు ఈ రెండు రోజులూ.

పండగలకి వచ్చిన అల్లుడుమీదా కూతురుమీదా అతనికి వైరాగ్యం వచ్చింది. ఏదో మాట్లాడదామని వచ్చిన భార్యని నాలుగు పిచ్చికేకలు వేసి వాసెల కొట్టేడు. అరుగుమీద గోతికంతులేస్తున్న మనవళ్ళని దగ్గరికి పిలిచి కసిదీరా వీపులు పగలకొట్టేడు.

ఈ రామరావణయుద్ధసంధికాలంలో శ్రీమూర్తులు లాగ దిగివచ్చారు - మునసబు, నారపరెడ్డి చంద్రాన్ని కూడా పెట్టుకుని. చంద్రం మళ్ళీ దొర వేషంలో తయారయ్యేడు. సిగరెట్టు వెలిగించాడు.

కరణం చంద్రాన్ని ఎంతో మర్యాద చేశాడు:

"మీకు చెప్పకుండా వెళ్లిపోయినందుకు క్షమించండి. రామచంద్రపురంలో నేనే యింట్లో పుట్టానో ఆయింటిని ఒకసారి చూసిరావాలని బుద్ధిపుట్టి వెళ్ళి వచ్చాను. పనిలో పని కాకినాడా సామర్లకోటా రాజమండ్రీ వీధులూ తిరిగి పూర్వస్మృతులు కొంత నెమరు వేసుకున్నాను..." అన్నాడు చంద్రం.

"మీరు నాకొక్క ఉపకారం చెయ్యాలి," అన్నాడు కరణం చంద్రం చేతులుపట్టుకుని దీనాతిదీనంగా చూస్తూ. "నా గుండెలలో బరువు తగ్గించండి. లేకపోతే నే అన్యాయంగా చచ్చిపోతానేమో—"

"నన్నేం చెయ్యమంటారు చెప్పండి—"

"వినండి—"

కరణం జరిగిన సంగతులన్నీ పూస గుచ్చినట్లు చెప్పుకుపోయాడు.

చంద్రం కళ్లు చెమ్మగిల్లుతూనే వున్నాయి. అతిభారంగా శ్వాసపీలుస్తూ లేచి ఒక నమస్కారం పెట్టి అన్నాడు:

"ఇక నేను సెలవు తీసుకుంటా...మీరంతా చేసిన సహాయానికీ చూపిన వాత్సల్యానికీ కృతజ్ఞత ఏవిధంగా తెలియజేయాలో!...మా శాస్త్రిగారు ఆఖరి సమయంలో ఒక మహత్కార్యం చేశారు. ఏమామూలు మనిషీ చెయ్యలేని పని చేశారు...ఉదాహరణకి ఒక్క విషయం చెబుతాను—"

లేచి నిలబడిన ఆ ముగ్గురు వ్యక్తులూ తదేక దీక్షతో వింటున్నారు—

"ఒక స్త్రీని భర్త క్షమించలేక పోయాడు. ఇంతకీ-ఆమె క్షమించమని కూడా ఎప్పుడూ అడగలేదు...తల్లిదండ్రులు,అన్నదమ్ములు కూడా క్షమించలేక పోయారు. బంధువులు పరిచయులు ఆప్రాణిని దరిదాపు రానీక చంపివేశారు...

"పతితయిపోయిన ఒక వ్యక్తిని బాగు చెయ్యడానికి బెదరింపులూ, నైతికఉపన్యాసాలూ, కాఠిన్యం చూపిస్తూ, పతివ్రతల కథలూ పని చెయ్యవు...శాస్త్రిగారు పూర్వం నాకు అతిసమీపంలో నే వుండేవారు. బాగా యెరుగుదును. పెళ్ళైన నాటినుంచీ ఆయన నన్నెరుగును. ఆస్త్రీవిషయంలో ఆయన కూడా చాలా చాలా కలగజేసుకున్నారు"

# ఎదురువచ్చిన మృత్యువు

"ఎవరా వ్యక్తి?" అనకుండా వుండలేక పోయాడు కరణం.

"చెబుతా... అపాత్రత చూపించడం వలనా, అదిక్కుమాలిన మనిషి నే ప్రేమించడం వలనా మార్చి వచ్చిన నేను... ఆ దర్శనాల్లోని ఇవ్వాళ్టికి ఈ స్త్రీ విషయంలో వృత్తాంతరంగా చూపించారు శాస్త్రి గారు..."

"ఈ స్త్రీని మీ రెరుగుదురా?"

"బాగా యెరుగుదును. ఆ స్త్రీయే శాంత!"

కరణం కొంచెం నివ్వెరపోయాడు. "తానిదివరకు శాస్త్రి గారికి నే రెరగనంది!"

"పాతికోట్ల ఐశ్వర్యకోశం వలన లాభం లేదు. ఆవిడ చెప్పిన పరిణామం కథ నిజమే అయివుండొచ్చు. ఘటన అంటే అలాగే వుంటుంది గరి—"

"పాపం... దరిమిలాని ఆ భర్త చనిపోయాడు లాగుంది—"

"ఆమెను వదిలేశాను. చాలాకాలం విడాకుల కాగితం మీద ఆమె సంతకం పెట్టలేదు. ఎటువంటి పరిస్థితులలోనూ భార్యగా వుండే హక్కులను పోగొట్టుకోనన్నది.. స్వతస్సిద్ధంగా ఆమె చాలా తెలివైనది; దగుపుచున్నది—చివరికి బెదిరింపులవల్ల కూడా పని జరగలేదు..."

"అల్లగా!... మీరు వెళ్ళిపోతున్నారా—"

"ఇప్పుడే.. వొచ్చిన పనేమో అయిపోయింది గదా—"

"శాస్త్రిగారు మీ కేసుపుత్రులో... ఆవిడ్ని మీ రెలాగ యెరుగుదురో... చెప్పేరే కాదు..."

వెళ్ళిపోడానికి లేచి అడుగులు వేసిన చంద్రం చిరునవ్వుతో ఆగిపోయాడు:

"ఈ రహస్యం దాపరికం యెందుకులెండి. మీ గుండెలమీదు కెట్టింపబడుతుందని భయపడి పూనుకున్నాను... ఆమె మొదటి భర్తను నేనే! ఎక్కడికో పారిపోయి, ఈ జనాన్ని బంధువులనీ చూపలేక, ఆమెకి వైధవ్యం ఇచ్చాను... నే చచ్చిపోయినట్లు వార్త పుట్టింది... పేరుమార్చుకుని బతుకుతున్నాను... ప్రథిత విశ్వనాథశాస్త్రి గారు నా స్వంత అన్నగారు.... సెలవా!"

కరణంమీద పెద్ద పిడుగుపడినట్లయింది. అతనికి తెలివి వచ్చేసరికి పావుకీలంతా ఖాళీగావుంది. వణుకుతున్న చేతులతో డెస్కు పెట్టి దగ్గరకూర్చుని తన ఉద్యోగానికి రాజీనామా పత్రం తయారు చేశాడు. అది - విశ్వనాథశాస్త్రి వ్యవహారాల మీద తాను రచించిన రిపోర్టుతో జతచేసి జిల్లా కలెక్టరు గారికి పంపుకున్నాడు.

# అవతారిక

"శిఖిముఖి"

సామగానంనుంచి సోమపానంవరకూ ఊగేకుండలాలు చెవులట్టుకుని ఝూషించి అడిగేస్తున్నాయి:

"చూశావా కష కెంతటి వాడయాన్నో?"

ఎంతటివాడయినాడో అంతుచిక్క లేదు అర్క సోమయాజికి.

తరంగాని పున్నామ నరకం. తీరా ఏరుదాటి తెప్పని తప్పిదాలు పట్టడానికి మన సొప్పక, పల్లెత్తుమాటన లేకపోతూ వచ్చేడు. కాని నేటికాలానికి గతించిన వైశ్యదేవ సంప్రదాయపు కులీనతను కదలించే ప్రశ్న దూసుకువస్తే, చిత్తం చివుక్కుమంది. తప్పనిసరిగా తల దించేసుకున్నాడు.

స్వరితంగా సద్దుకుంటూన్న స్వర్ణ కుండలాలకి ఆయన ఆందోళనకి తగని చిలిపిగా నవ్వేసుకువచ్చింది. ఒక్కక్షణం ఆగి మళ్ళీ ఊగిసలాడేయి, ఉదాత్తంగా. కలికాలం అండచూసుకుని గద్దించేయి: "సినేన్నయ్యా! ఈపాటికి ముద్దుమూని, మొహం వాచేటట్లు చీవాట్లు పెట్టరాదూ?"

ఓహో అనిపించుకున్న సంప్రదాయానికి కాలమహిమ నెంతటి కళంకం వచ్చింది! అని కించపడ్డాడు. ఓకాడికి నిశ్చయానికి వచ్చేడు:

"అవును: చీవాట్లు పెట్టాలిసిందే!"

కొడుకు రాగానే కడిగెయ్యదలచుకున్న మాటల్ని బుక్కు బుక్కుగా తుణ్ణం చేసుకుని ఘనా, జటాగా పెనవేసి వల్లె వేసుకున్నాడు.

అప్పటికే చీకటి ఆరుఘుల్ల రాత్రిని వడి కట్టుకుని జోకొడుతోంది. రాత్రి పళ్లు విరుపు కన్నగారిలా ఆవులింత వచ్చింది సోమయాజికి.

"ఇహాను రాడు!" అని శాస్త్ర చాదస్తంగా పైకే అనుకుని, కూర్చున్న పాటునే ఓ కునుకు తీసేడు.

ఇక్కడి కిదయిందా...

అక్కడ పుత్రరత్నం పైబేస్తుమీద కుదేలయి, అటూ పేకా చెల్లంగోరు చేసుకున్నాడు. దారి పొడుగునా దీపాల రేఖల్ని పరకాయిస్తూ, కిటికీల సందులకు కళ్లు వప్పగించి ఇంటి మొహం మయ్యాడు.

ఏ కలవారికోడలో చూరుదాపున సుప్వి—సువ్వన్న—గా చుక్కల్ని కదలేస్తోంది. యాదాలాభంగా కలయజూచి,

"పిచ్చ వేషణమా, పిల్లా?" అన్నాడు. శాస్త్రం చెప్పిన తరివాయిగా.

ఏదీ కానివేళ మగగొంతులో చిన్నదానికి పెద్ద చిన్నతనం వినిపించింది. ప్రోషిత భర్తృకత్వంలో ఇంటిల్లిపాదీ తనే అయి మసిలే ఇల్లాలు, మరి. కళవళపాటులో కాని మాటలు దొర్లకుండా మునిపంటితో అధరాన్నదిమి పట్టుకుంది. సూటి తప్పిన సువ్విపోటులో రోకటిపన్ను రోటి పెదవిని కాటేసి ఖాయిదాలో ఉంచింది.

మౌనం అర్థం అంగీకారం అని సంతృప్తి పడడాని కిచ్చగించని ఘటికుడు. ప్రత్యామ్నాయాలతో పరామర్శించి, కవ్వించి కదలేయదలుచుకున్నాడు.

"మరయితే ఊకదంపుళ్లా, ఊః కొట్టడాలు దండుగన్నట్లు ఉలకకుండా ఉన్నావు?"

"మేఃల్ని కాసి తెచ్చిన నూకలుంటే ఇలా ఇయ్యరాదూ?" ఉఫ్‌మని ఉలికించేటట్లంది.

ఒక్కగానొక్క అంగ ముందుకు వేసి, భుజంమీద ఉత్తరీయాన్ని చేజేతులా పీక మీదకి తెచ్చుకున్నాడు.

"వయ్యారం! రోకలి చిగిర్చగలదు!"

"తలకి చుడతానని ఆశిస్తున్నావా? వెర్రివాడ!" అని మందలించింది. అరక్షణం ఆగి: "యౌవన యమునాతీరాల తుంగ సంగతి జ్ఞాపకం లేదో!" అంది.

ఒక్కచిటికెడుసేపు చిత్తయిపోయాడు.

"వాకిటి కావలి తిమ్మని వాకిట అకటి కవికోటి కిటికోటిగా పడివుంది, బేలా!"— మాటుపెట్టిన చాటువు చాటున చాయంగల విన్నవాలై తెరిపిన పడ్డాడు.

ప్రౌఢ బెట్టుసరి ఓమెట్టు దిగింది. అసురుసురయ్యే, తాడెత్తు ప్రమాణాన లేచిన రోకలి నలా అంతరిక్షంలోనే అట్టే పట్టుకుని, కుడిభుజంమీద కిలకిలలాడింది. చూపుల వెంబడే సరసను జేరి సరసాలాపనం మొదలెట్టేడు కడ కెంతటివాడో అయిన అతగాడు.

"ఎగ్గైనా లేదూ? ఎవరేనా చూస్తారు!" చిరుకోపించిందామె.

"చూసేవాళ్ళకి సిగ్గుండొద్దూ?"

"నీకేం, మగరాయుడివి. లోకులు కాకులు కదూ?"

"అయితే, వాళ్ళతో 'కావు, కావు' కొట్టిస్తే సరి! అయినా ఈపాటి బెంబేలు పడేదానివే ఇంత కవ్వించావు దేనికి?"

"శ్రావణీల రాత్రులు. బొత్తిగా ఒంటరిదాన్నై చిన్నబోయానుగదా అని ఉలికించేనే అనుకో. అయితే మాత్రం ఇంత ఆగడమా? లంకకు చేటుగా వ్యవహరించాలా?"—ఇంటి గుట్టుగా గుసగుసలాడింది.

సమాధానపడి ఛాయలోనికి సర్దుకున్నాడు. "మరయితే..." లోమాట కొంగుగోయింది.

